శ్రీ గిరిజాంబాయైనమః

# అబలాసన్మార్గబోధిని.






ఇయ్యది

మాసం వేంకటరత్నాంబచే

రచియింపఁబడినది.

కాకినాడ:
శ్రీ సావిత్రీ ముద్రాక్షరశాలన్ముద్రితము.
1917.

దీనివెల 2 అణాలు.

# విజ్ఞప్తి

శ్రీయసోదరీమణులారా !

ఈ గ్రంథ ముద్రణంబునకైన ధనవ్యయములో నీదిగువ నుదహరించఁబడిన నామంబులుగల సోదరీమణులు నాపయి సోదరీవాత్సల్యముం జూపి కొంతవరకు ధనసహాయభూతురాండ్రయినందులకు నేనెంతయు వారలకుఁ గృతజ్ఞురాలను.

## పోషకులు.

శ్రీమతి సంగంరెడ్డి పాపమ్మగారు

,, మాసం లక్ష్మమ్మగారు

## సహాయులు

శ్రీమతి ఆదిభట్ల నారమ్మగారు.

,, వుంగరాల చిట్టెమ్మగారు.

,, కొత్తా పయిడితల్లిగారు.

,, తామాడ నారాయణమ్మగారు.

,, మీసాల రాజాలమ్మగారు.

,, కళ్యానపు మంగమ్మగారు.

,, వేమ్మూరి చెల్లయమ్మగారు

,, కర్ని నారాయణమ్మగారు.

,, తాళాబత్తుల లక్ష్మీనరసయ్యమ్మ గారు.

,, సరస్వతీబాయిగారు.

శ్రీమతి కింతల సన్యాసమ్మగారు.

,, వీరమల్లి లక్ష్మీదేవిగారు.

,, కింతల వరహాలమ్మగారు.

,, గెంబలి సీతారామమ్మగారు.

,, గుడ్ల వెంకటరత్నమ్మగారు.

,, కోర్లాపు చిట్టెమ్మగారు.

,, కే. జానికరమణమ్మగారు.

,, కోనా వెంకయ్యమ్మగారు

,, కోనా పాపయ్యమ్మగారు.

,, పసుమర్తి జగ్గయ్యమ్మగారు.

,, కడారి సాయమ్మగారు.



శ్రీ గిరిజాంబాయైనమః

# అబలాసన్మార్గబోధిని.

ఇయ్యది


మానం వేంకటరత్నాంబచే

రచియింపఁబడినది.



మొదటికూర్పు 500 ప్రతులు.

కాకినాడ:

శ్రీ సావిత్రీ ముద్రాక్షరశాలను ముద్రితము.

1917.





[దీనివెల 1 అణాలు.

# పీఠిక.

---

హిందూసుందరులారా!

అబలాసన్మార్గబోధినీ గ్రంథకర్త్రిణులగు శ్రీమతి మానం వేంకటరత్నాంబగారు, తొలుత నీగ్రంథమును వ్రాయుట ముగించి, నాకడకుఁ బరిష్కరించుటకు నంప, నే నెంతయుఁ గృతజ్ఞతతోఁ గైకొని, బాలుండనగుటంబట్టియు, కవిత్వమున నల్పజ్ఞానుండనగుటంబట్టియు నాయథాశక్తిపూర్వకముగా నందలి దోషంబులను గొంతమట్టుకు వ్యక్తిపరచి, యచిరకాలంబులో నే యీగ్రంథ మామెకుఁ బంపితిని. ఆమెకూడ నల్పవిద్యాపరిచయు రాలగుటంబట్టి గ్రంథంబున లోపంబులుండవచ్చును. కాని చిన్ననాఁటనుండి శ్రీ పార్వతీనామస్తోత్రమునం దాసక్తిపరురాలగుటంబట్టి యీచిన్నిగ్రంథంబు రచియించెననుటకు నించుకయు సందియములేదు. ఆమెయొక్క కవనము బుధనుతము. పాటలుకూడ నర్థలయజ్ఞానములఁ గలిగి మనోరంజకముగా నున్నయవి. హిందూసుందరు లల్పవిద్యాపరిచయురాండ్రైనను, నిట్టి సద్గ్రంథంబుల రచియించు టెంతయుఁ జోద్యము. నీతిదాయకమగు నీపొత్తముఁ బ్రతి హిందూసుందరియుఁ, బ్రతి బాలికయు నెంతయుఁ జదువఁదగినదని నా నమ్మకము.

బొబ్బిలి,
5-5-1917.

ఇట్లు, విద్వజ్జనవిధేయుఁడు,
అల్లమరాజు బాలకవి.

# మ హో ప కా ర ము.

ఈగ్రంథవిక్రియమువల్ల వచ్చువిత్తంబంతయుఁ బేద రాండ్రు నసహాయురాండ్రునగు శ్రీ హిందూబాలికామణు లందుఁ, బ్రారంభవిద్యాభ్యాసాసక్తిఁగలవారి యుపయోగార్థమై వాడఁబడును.

ఇట్లు, మీసోదరి,

పూానం వేంకటరత్నాంబ.

# విషయసూచిక

# ఉపోద్ఘాతము

ప్రియసోదరీమణులారా !

నాకు బాల్యంబునుండియుఁ బాటలయందుఁ గడుఁ బ్రేమజనించుటంబట్టియు, గిరిజాంబనే నాయిష్టదేవతగా నెంచి కొనుటంబట్టియు, సరస్వతీకటాక్షవీక్షణప్రసాదంబుచే నించుక కవితాధోరణి యలవడుటంబట్టియు నీచిన్నిగ్రంథంబు రచియించినదానను. నేనల్పవిద్యాపరిచయురాలనగుటంజేసి యిందనేక లోపములుండవచ్చును. గాన,

ఆ॥ వె॥ తప్పులున్నయెడల ♦ నొప్పులుగానెంచి
దయనుజూడమదిని ♦ దలఁచరమ్మ !
భక్తితోడ మీకు ♦ వందనంబులని దే
యొసఁగుచున్నదాన ♦ నుపిదలార !

ఇట్లు, మీసోదరి,

మాసం వేంకటరత్నాంబ.



# రాజభక్తి.

జంఝూటిరాగము—ఏకతాళము.

(ప్రియుఁడేల మాయలాడిగూడి ప్రేమమరచెనే—వలె)

1. సుగుణాఢ్యుఁడైన జార్జిప్రభుని - సుదతిమేరినిఁ
జగదంబ ప్రేమ నేలుఁగాత. - సంతతంబును ॥ సుగు ॥
2. రణరంగమందు విజయమొంది - రాజచంద్రుఁడు
జనబృందములను నేలుఁగాత - సత్కృపామతిఁ ॥ సుగు ॥
3. కడుసౌఖ్యములనుబొందుచుండి - కాంతతోడను
పుడమీతలంబునందు మమ్ముఁ - బ్రోచుగావుతఁ ॥ సుగు ॥
4. ధర వేంకటాంబనేలునట్టి - తరుణి పార్వతిఁ
సరసాబ్జపత్రనేత్రలార! - సతము వేఁడుఁడీ! ॥ సుగు ॥

చ॥ నిరతము జార్జిభూవరుని ♦ నీరజపత్రవిశాలలోచనఁ
బరమపతివ్రతామణిని ♦ భవ్యగుణావళి మేరిరాణినిఁ
బరమకృపారసంబునను ♦ పాలనసేయుచు, హైందవప్రజఁ
గరుణనునేలుచుండ శివ ♦ కాంతవరంబులొసంగి ప్రోచుతఁ ॥



శ్రీ

# అబలాసన్మార్గబోధిని.

## ఇష్టదేవతాప్రార్థన.

క॥ గిరిజాంబను గాత్యాయని
హరుపట్టపురాణి గౌరి ◆ వలరుద్రాణిన్
ధరణీధరవరపుత్రిన్
విరతంబును గొల్చుదాన ◆ నిండగుభక్తిన్ ॥

## గురురాలి ప్రార్థన.

గీతమాలిక.

నాదుబాల్యంబునందున ◆ నన్నుఁబాసి
స్వర్గపురమును వీక్షింపఁ ◆ జనెను జనని
నాఁటినుండియు నాదుమే ◆ నత్తవిధవ
శ్రీశ్రీకాకుళపురవాసి ◆ చెన్నమాంబ
యమలగుణాలంబనై నెడ్డి ◆ యప్పయాంబ
గన్నపుత్రికమాడ్కి నన్ ◆ గాంచిపెంచి
పెద్దగాఁజేసి నాకుబల్ ◆ సుద్దులెన్నొ

పతివ్రతాతిలకంబులై ♦ పరఁగునట్టి
స్త్రీలచారిత్రములనెన్నొ ♦ చెప్పి చెప్పి
ముక్తిమార్గంబులెన్నియో ♦ బోధఁ జేసి
యిట్లు స్త్రీధర్మములనాకు ♦ నెన్నొ చెప్పి
తానె గురురాలుగానుండి ♦ తరుణులార!
స్వల్పకాలంబులోనన్నుఁ ♦ జతురమతిగఁ
జేసి మోదంబునాకిచ్చె ♦ వాసిమీఱ
నాదుగురురాలిమేలు నె ♦ న్నండు నేను
మరవఁగాఁజాలనతమునా ♦ మానసమున
మొదట గిరిజాంబికను వేఁడి ♦ పిదప నీమె
భక్తితో వేఁడుచుందును ♦ బడఁతులార!
పూజలెన్నెన్నియో సేతుఁ ♦ బాలతులార!
రమ్యగుణరాశి నాగురు ♦ రాలికివియె
వందనములిచ్చుదాన నా ♦ నంద మెసఁగ ॥

## చెలుల ప్రార్థన.

గీ॥ చిన్ననాఁటనుండియు నాదుఁ ♦ జెంతఁ జేరి
పాటలను బాడి ముదమున ♦ నాఁటలాడి
నాదుకుశలంబు నరసెడు ♦ నాదుచెలుల
కివియె వందనంబులఁ బేర్మి ♦ నిచ్చుదాన ॥

శ్రీ

## కవయిత్రి వంశావళి.

సీసమాలిక.

పార్వతీశ్వరులకా ♦ వాసమైచెన్నొందు
        భరతఖండమునందుఁ ♦ బ్రబలమయ్యె
ధనధాన్యములతోడఁ ♦ దనరారు గంజాము
        జిల్లాకులోనిదై ♦ చేరియున్న
జలుమూరుగ్రామంబు ♦ స్థానంబుగానుండి
        వంశాభివృద్ధితో ♦ వరలుచున్న
ధనపాలగోత్రంబుఁ ♦ దగఁబవిత్రముసేయ
        నుద్భవించినయట్టి ♦ యుంగరాల
అప్పయామాత్యునకు ♦ ననుఁగుసుతుండయి
        నారాయణుండను ♦ నామమొందెఁ
అలరువానికి ద్వితీ ♦ యకళత్రమైయొప్పి
        పతివ్రతాతిలకమై ♦ పరఁగునట్టి
నారాయణాంబకు ♦ గారాబుతనయనై
        జన్మించితిని నాదు ♦ జనకుఁడపుడు
వేంకటాంబయనెడి ♦ పేరు నాకుంబెట్టి
        ముద్దుగాఁబెంచిబల్ ♦ విద్దెలిచ్చి
నాదు మేనత్తత ♦ నయుఁడును సుగుణుండు
        చెలఁగు మానం వంశ ♦ శీతకరుఁడు

కూర్మయ్యకు ద్వితీయ ♦ కొమరుఁడున్ సద్గుణా
సాంద్రుండు కడుయశ ♦ శ్శాలియైన
వానికి నన్నిచ్చి ♦ పరిణయంబునుజేసె
బంధువుల్ మిత్రులా ♦ నందమొంద
నాఁటినుండియు నాదు ♦ నాథునే దైవంబు
వలెనెంచి పూజలు ♦ సలుపుచుంటి
గౌరవంబందెదు ♦ కాంక్ష లేదొక్కింత
ముక్తిమార్గమున కా ♦ సక్తినొంది
నిరతంబు నామదిన్ ♦ గిరిజాంబనేనిల్పి
భక్తితోనేఁగొన్ని ♦ పాటలిటులు
రచియించితినిగాని ♦ రచన సేయఁగ లేదు
గొప్పకై యాసించి ♦ మెప్పుఁగాంచఁ

గీ॥ దప్పులెన్నేనిగలవు నా ♦ తప్పులరసి
తూలనాడకమీరు నా ♦ మేలుఁగాంచి
తప్పులన్నింటి మీరెల్ల ♦ నొప్పులుగను
నెంచి దయతోడ నన్ను మ ♦ న్నించరమ్మ!
హెచ్చుగా నాకు నానంద ♦ మీయరమ్మ!
మించి మిమ్ములమిగులఁ బ్రా ♦ ర్థించుచుంటి
సుగుణవతులార! నాకూర్మి ♦ సుదతులార! ॥

## సభావందనము.

సీ॥ సతతంబుఁ బతిసేవ ♦ నతులితభక్తితో
నొనరించు భూసుర ♦ వనితలార!
పతులకు సాహాయ్య ♦ పరలయ్యి రాజ్యముల్
పాలించు క్షత్రియ ♦ భామలార!
ద్రవ్యంబుగలదంచుఁ ♦ దగులవెట్టకదాచి
బేరముల్‌గను వైశ్య ♦ నారులార!
పతులతోడనుగూడి ♦ పడరానిపాట్లొంది
సుఖములందెడి శూద్ర ♦ సుదతులార!

గీ॥ మహిని దేశాభిమానంబు ♦ మానకుండ
దేశసేవకురాండ్రయి ♦ యాశతోడ
మిగులశ్రమలొందు హైందవ ♦ మగువలార!
కొనుఁడు నావందనంబులు ♦ కూర్మితోడ॥

## కలికాంతలు.

కాంతామణులారా!

నారీరత్నంబులకెల్లరకునుగల యలంకారంబులలోనెల్ల నుత్తమమైనది దైవభక్తియేకదా: ఇహపరలోకంబుల ముక్తి నిచ్చునది యీవ్రతంబేకదా. అట్టి యీవ్రతనిష్ఠ నభ్యసించుచు సుగుణపరాయణలగు తలోదరులకుంగల సౌఖ్యానందంబులకు మేరలేదుకదా. కాని, ప్రస్తుత కాంతామణులలో గొందరు,

సీ॥ పతులసేవలటన్న ♦ మతిసేవగించెడు
భామామణుల్ గదుఁ ♦ బ్రబలినారు
ఓనమ లెరుఁగక ♦ యొరులదూషించెడు
పూఁబోఁడు లెందరో ♦ పుట్టినారు
దైవతార్చనమాని ♦ తగననాచారవా
హరిణాక్షు లెందరో ♦ పెఱిగినారు
కల్లు గంజాయిలు ♦ కడుమత్తుగాఁద్రావు
నెరజాణ లెందరో ♦ నిండినారు

గీ॥ ధర్మమనుమాట మదిలోనఁ ♦ దలఁచనట్టి
మించుబోఁడులుచాల జ ♦ న్మించినారు
జనని జనకుల యానతిఁ ♦ గొనకమదిని
కడుఁగడుందూరు సుందరుల్ ♦ గలిగినారు ॥

అదియునుగాక,

సీ॥ పతినిదైవంబుగా ♦ భావంబునందెంచి
సేవఁ జేయుఁడటన్నఁ ♦ జేయలేరు
పరపూరుషులసహో ♦ దరులుగామదినెంచి
తిరుగుఁడటన్నచోఁ ♦ దిరుగలేరు
ఆచారములఁగల్గి ♦ యతిపవిత్రులుగాగ
నుండుఁడటన్నచో ♦ నుండలేరు
మద్యపానాదులు ♦ మానిమోదంబున
బ్రతుకుఁడటన్నచో ♦ బ్రతుకలేరు

గీ॥ తల్లిఁదండ్రులయానతి ♦ దాటకుండ
జీవనము చేయుచున్నవోఁ ♦ జేయ లేరు
మంచిమార్గంబులఁ బొండ ♦ టంచుఁ జెప్ప
దుష్టమార్గంబులఁ గటా! ♦ ద్రొక్కుచుంద్రు॥

## ఆంగ్లేయ పరిపాలనాలాభములు.

ఆహా! ఖరఖరుండస్తమించని ధరిత్రీ రాజ్యంబు నెవ్వార
లేలుచుండిరో? స్వారాజ్యంబుననున్న జీవరాసులకు నమితా
మోదంబు నేశాంతశీలురొసంగుచుండిరో? దైవాధీనంబులు
కాని వస్తుసామగ్రి నూతనంబుగనే కుశాగ్రబుద్ధులు కనుఁగొను
చుండిరో? ఎవ్వారి పరిపాలనంబున జనంబులు ముదంబున గుం
డియలపైఁ జేతులిడికొని హాయిగ సుఖనిద్రనుజెందుచుండిరో?
ఎవ్వారి మహోపకారంబులు లోకవిఖ్యాతంబులై యనంత
యశంబు నొసంగుచుండెనో? సకలసద్గుణమాతయగు భారత
మాత యేసుగుణాఢ్యుల నమితానురాగంబునఁ బ్రేమించు
చుండునో? యట్టి వీరులు, రణధీరులు, శౌర్యసాహసులు,
సద్గుణోత్తములు, కీర్తిసాంద్రులు, రాజ్యధురంధరులు, భీకర
ప్రతాపులు, చారురూపులు, పవిత్రచారిత్రులు, సురసన్ను
తులునైన హూణప్రభువర్యుల మహోపకారంబులు లెక్కింపఁ
దరమా? పరమసాధ్వియగు శ్రీ విక్టోరియా చక్రవర్తిని యరువది

వత్సరంబులు రాజ్యమేలి హైందవులకు స్వజాతీయులకు నధికో
ల్లాసమొసంగలేదా! రాజ్యకార్యధురంధరుఁడగు శ్రీ సప్తమ
ఎడ్వర్డు చక్రవర్తి జననీమణి ననుసరించలేదా! సుగుణరత్నా
కరుండగు శ్రీ పంచమ జార్జి సార్వభౌముండు మనకొనర్చిన
యమితోపకారంబులఁ జెప్పనలవియగునా! ఏదిక్కుఁగనుఁ
గొన్నను యంత్రాలయంబులే. ఏదిశపరికించినను విద్యాలయం
బులే. ఏదెసనీక్షించినను వైద్యశాలలే. ఏడఁజూచినను దివ్య
భవనంబులే. ఏవంకవీక్షించినను బత్రికాలయంబులే. ఏవేళ
నాలించినను ధూమశకటధ్వనులే. ఎచ్చోటఁగాంచినను ధర్మ
కావ్యస్థానంబులే. ఇవియన్నియు మనకుఁ గన్నులపండువ నొన
ర్చుటకల్లయా? ఏమి మహోపకారములు! ఎంతయాశ్చర్యకర
ము! ఎంతసౌఖ్యానందము! ఎంతయశస్సు!

## విద్య.

మనకు సర్వసుఖంబులనిచ్చి మిగులయశస్సునిచ్చు మహా
యంత్రంబు విద్యాధనంబయేకదా. ప్రజలమూర్ఖత్వంబునకును,
యవివేకంబునకును, జారచోరాదిదుష్టగుణంబులకును, ప్రబల
కారణంబు విద్యాహీనతమేకదా. విద్యలేనివాని జన్మమేల?
సద్గుణైశ్వర్యంబులొసంగు నీమహాయంత్రంబునుఁ బాయుట
తగునా? విద్యవలననే మనకు నష్టైశ్వర్యంబు లభ్యపడుచున్నవి.
అట్టి యీవిద్య మనకొసంగి, యింకను విద్యాభివృద్ధినొనర్చు

చున్న హూణులమహోపకారంబులు మరవఁగలమా? ప్రతి
హిందూపురమునందు నెన్నియో విద్యాలయంబులు గట్టించి,
వానినిమిత్తంబు వేనవేలు రూకలు వ్యయమొనర్చుచుఁ, బ్రతి
హిందూబాలకునకు విద్యాభ్యాసమలవడునట్లుచేసి, సుగుణవం
తులుగానొనర్చి, తుదకు గౌరవోద్యోగంబులనిచ్చుటలేదా?
పురుషవిద్యమాట యటుండనిండు. స్త్రీవిద్యఁగూర్చి ముచ్చ
టింతము. హిందూసుందరులు తొలుదొలుత నెట్టిదుస్థితియం
దుండి యిప్పు డెట్టియౌన్నత్యంబునందున్నవారలో పరికింపుఁ
డు! ఎచ్చటఁజూచినను బాలికాపాఠశాలలస్థాపించి స్త్రీలకు
మిక్కుటంబుగా విద్యాభ్యాసముజేయించుచు, వారికిఁ దగిన
ప్రోత్సాహమొసంగుచుఁ, గానుకలొసంగుచు, ననేకసారులు
స్త్రీసంఘసంస్కరణాభిలాషసభలఁజేయించి, స్త్రీలచేత నేదో
యొకదానింగూర్చి వ్యాసంబులఁజెప్పించుచుఁ, బొట్టఁజీల్చిన
నక్షరంబులులేని పొలతులపొట్టనిండ నెట్టకేలకు విద్యాభివృద్ధి
నింపి, సుగుణవతులుగాఁజేసి, యింక నచ్చటచ్చట మిగిలిన
మూర్ఖురాండ్రనిమిత్తము పెక్కుశ్రమలొందుచుఁ బాఠశాలల
స్థాపించుటయందును, బోధించుటయందును, సత్ప్రయత్నముల
సలుపుచుండిరి. మూర్ఖురాండ్రగు హైందవనారీమణు లింత
స్వల్పకాలంబున నింత విద్యావతులుకాఁగలరని స్వప్నమం
దైనను దలఁపమైతిమి. ఆహా! హూణులొనర్చిన మహోప
కారంబులలోనెల్ల నిదియొకటి యగ్రగణ్యమైనది.

## ఆరోగ్యము.

సకలజీవులకు ముఖ్యమైనది దేహారోగ్యంబొక్కటని యనఁదగు. హిందూదేశంబున నేఁడఁజూచినను వైద్యశాలలు బెట్టించి, యందు డాక్టరులనుంచి, వచ్చురోగులకు దేహమనారోగ్యంబుగానున్నవారలకు, దేహాస్వస్థతకు మంచిమందులిచ్చుటయు, నాదిగాఁగల సదుపాయంబులఁ జేయుచుండిరి. ఇంతియే కాక, మదరాసు, విశాఖపట్టణంబులందు గొప్పవైద్యాలయంబులు గట్టించి, డాక్టరు పరీక్షయును పేరుబెట్టి, పట్టపరీక్షయందును, నింక మఱికొన్ని పరీక్షలయందు నారితేఱినవారిఁ గొందరి నీయాలయంబులలోఁ బ్రవేశబెట్టి, వైద్యవిద్య విస్తారంబుగాఁ జెప్పించుచు, మిగుల కీర్తిసొందు్రలఁజేయుచుండిరి. ఇప్పుడు జరుగబోవుచున్న ఐరోపామహాసంగ్రామసమయంబున వైద్యవిద్యనేర్చిన మహనీయులును, వైద్యశాలలును ఎంతమహోపకారమొసంగుచుండెనో యాలోచించిన మనకే గోచరమగును. వైద్యశాల లెందఱిప్రాణంబులఁ గాపాడుచున్నవి! ఎంత సౌఖ్యానందంబు లిడుచున్నవి!

## నీటియంత్రములు.

శరీరారోగ్యంబునకు ముఖ్యము నిర్మలమైన యుదకంబుకదా! అట్టియుదకంబు ప్రతిసరస్సునందుఁ, బ్రతికొలనునందుఁ, బ్రతిగుట్టయందుఁ, బ్రతిబావియందుఁ గలదు. కాని,

నిష్ప్రయోజనము. అనుదినంబును పురజనులుపోయి బట్టల నుదుకుటయు, నుదకంబులో ననవసరవస్తువులఁ గొన్ని కలుపుచుండుటయు నాదిగాఁగల కృత్యంబులనుబట్టి పుష్కరముల నిర్మలంబులుగాఁ జేయుచుండిరి. మఱల నాయుదకంబునే మనము ద్రాగుటవలన జాలజబ్బులకు లోనగుచున్నారము. ఇట్టి దురవస్థ హూణులు చూచి, దూరంబుననుండు నొక్కనది నుండి నీటిగొట్టంబులఁ బెట్టుచు వానిగుండా జనులకు స్వచ్ఛమైన యుదకంబు నొసంగుచుండిరి. అందుఁబట్టి అనారోగ్యత తగ్గినది. ఇట్లు దేశమందెల్లను సదుపాయము జేసియున్నారు. ఇంకను ననేక పురములందుఁ బెట్టుటకుఁ బ్రయత్నంబు లొనర్చుచుండిరి. మహోపకారంబులలో నిదియొకటి.

## పొగబండి.

తొల్లింటికాలంబునఁ బ్రయాణమన్న గుండెలు ఝల్లు మనుచుండెడివి. బాటలు లేవాయె. ఎచ్చోటఁజూచినను గాంతారప్రదేశంబులే. ఎచ్చోటవీక్షించినను చోర, ఘాతుకజంతుభయంబే. పూర్వకాలంబున బాటసారులు విరివిగాఁ బ్రాణంబులఁగోలుపోవుచుండిరి. పడరానిపాట్లొందుచుండిరి. అదియునుగాక, పూర్వము కాశీ ప్రయాణమన్న ననేకదినంబులు పట్టుచుండెడిది. ఇప్పుడో కొలఁది దినంబులలోనే పోవుచుంటిమి. ఇంగ్లీషు ప్రభువులు ప్రజ లిట్టికష్టంబులపాలగుటను

గాంచి, పొగబండియనునది బెట్టి దానిమూలంబున నెంతదూర దేశంబునైన నిమేషకాలంబునఁ బోవుచున్నాము. విస్తారము ధనవ్యయముకూడ ననవసరంబుగానున్నది. ఎంత సౌఖ్యము! ఎంతమాయ! ఎంతత్వరితము! ఎంతస్వల్పధనవ్యయము. దీని మూలంబున ననేకలాభంబులు కలుగుచున్నవి.

## తంతి ఆఫీసులు.

పూర్వకాలంబున నుత్తరంబుల నొకయూరినుండి, యింకొకయూరికిఁ బంపుట యెంతోకష్టతరముగా నుండెడిది. బందిపోటులబాధలు, వనమృగములవలన బాధలు, నింక నెన్నియో బాధలు కలుగుచుండెడివి. ఇప్పుడో, యెట్టిదుర్ఘమైన యాటంకంబులులేక నిరాయాసంబుగా నెంతదూరదేశపువార్తలయిన నొకటిరెండు దినంబులలోఁ దెలియుచున్నవి. పూర్వమొకరి క్షేమవార్త, యింకొకరికిఁ దెలియుటయే, గొప్పయాశ్చర్యకరముగాఁ గనుపట్టుచుండెడిది. తరువాత మనమొక యూరినుండి, యింకొకయూరిలోనున్న మనవారలకు విత్తముబంప నుద్దేశంబున్న వీనిమూలంబున నంపవచ్చును. మనవార్త నొక్కక్షణములోఁ దెలియఁజేయుటకు టెలిగ్రాముకలదు. ఇట్లే మనమేవస్తువునైనను, గ్రంథంబులనైనను, బట్టలనైనను, పార్సిల్సుకట్టి యీయాఫీసులమూలంబుగానే బంపవచ్చును. ఇంగ్లీషు వారు మనకుఁజేసిన మహోపకారంబులలో నిదియొకటని నుడువ

వచ్చును. ఈయాఫీసులమూలంబున నెన్నియో కార్యములు జరుగుచున్నవి.

## ముద్రియంత్రాలయంబులు.

మునుపు మనవారలేగ్రంథంబులు వ్రాసినను దాటి యాకులపై వ్రాయుటయు, నయ్యవి నశించుటయు, నిట్లనేక శ్రమలఁబొందుచుండిరి. ఇప్పుడో, యెంతపెద్దగ్రంథంబులైనను సునాయాసంబుగాఁ గొలఁదికాలంబున నచ్చొత్తించుటకుఁ దగిన ముద్రిశాలయంబులు శ్రీ బ్రిటీషు గవర్నమెంటువారు మనకుఁ గలుగఁజేసిరి. ముద్రిశాలయంబులవల్లఁ బ్రిస్తుతము గలుగు నమితోపకారంబుఁ జెప్పఁదరమా? వార్తాపత్రికా ప్రికటన దీనిమూలంబుననేకదా. యుద్ధసమయంబగుటనుబట్టి దీని యుపయోగం బింతింతయని నుడువవలవికాదు.

## న్యాయస్థానంబులు.

పూర్వకాలంబున గొప్పగొప్ప కలహంబులు జనించి, యొకరినొకరు దిట్టుకొనుచుఁ గొట్టుకొనుచుఁ, గత్తులతో నరుకుకొనుచు, మరణంబునకుఁ బ్రాప్తులయి యనేక కష్టంబులనుభవించుచుండిరి. ఇప్పుడో, ఎచ్చోటఁ బరికించినను న్యాయస్థానంబులే. కొట్టుటలు, తిట్టుటలు మొదలగువానికిఁ దీర్పుఁజెప్పుటయు, నేరస్తులకు శిక్షవిధించుటయు, చోరత్వంబడుగంటునట్లు

కొల్లవోట్లనుఁ బోలీసు వీరులను నియమించుటయు, నేవిధమైన యల్లరలు జరుగకుండునటులు దగినకట్టుదిట్టంబులఁ బెట్టుటయు నాదిగాగల నియమంబులు గలవు. వీనివలన దేశంబున శాంతం బు గలిగినది. ఇంగ్లీషువారలొనర్చిన ఘనకార్యములలో నిది యొకటి.

## వివిధోపకారములు.

మంచిబాటలు నిర్మించిరి. సంగీతయంత్రంబులనఁగా, హార్మోనియములు, గ్రామఫోనులాదిగాగల వెన్నియోగని పెట్టిరి. వార్తాపత్రికలు విరివిగా బ్రకటింపుచుండిరి. ధర్మ కార్యాలయంబు లెన్నియో స్థాపించుచుండిరి. సముద్రప్రయా ణంబు బహుకష్టమనుమాటఁ దొలంగించి పొగయోడలనిర్మించి తరంగభంగం బొక్కింత లేకుండునటులు చేసి, యమితానందం బొసంగుచుండిరి. బట్టలయంత్రంబులు, ద్విచక్రశకటంబులు, మోటారుకారులు, ట్రాముకారులు మొదలుగాగలవి పుట్టించి ప్రజలకు మోదంబుగొలుపుచుండిరి. బయోగ్రాఫుయంత్రం బులు, మెరుపుదీపంబులు, గాలివిమానంబులు, వ్యవసాయ యంత్రంబులు, వర్తకమున్వృద్ధి, టైపురైటింగు మిషనులు, ధనాగారంబులు, పుస్తకభాండాగారంబులు మొదలుగాఁగల మహోపకారంబులు లెక్కింపనలవికాని వెన్నెన్నియో సమ కూర్చుచుండిరి. హిందూసుందరులారా! మనక్షేమాభివృద్ధి

కొఱకు నిన్ని శ్రీమలఁ బొందుచున్న శ్రీ పంచమజార్జి చక్రవర్తి గారికిని, శ్రీ మేరీ రాణీగారికిని చిరకాలము శ్రీరమణీప్రియుం డధికైశ్వర్యంబులనుగూర్చి యధిక ప్రేమంబుతోఁ బరిపాలించు నటులు వరమొసంగుమని దైవమును భక్తితో వేడుఁడు.
శ్రీ యాంగ్లమహాప్రభువులకు సౌఖ్యానందంబులు కలుగుగాక!
మన తల్లియగు భారతాంబను జార్జీశుఁడు చిరకాలమేలుఁగాత!
హూణులకఖండజయంబగుగాక!

బ్యానుస్వరము—వకతాళము.

1. జయముగలుగఁజేయవే! - చాన శ్రీ బ్రిటానియాకు
నయముమీరవేఁడెదము - నాతిగారి! ప్రోవుమా ॥జయ॥

2. ధరణిరాజ్యభారమెల్లఁ - దాను మోయుచున్
గరుణతోడ మనలనెల్లఁ - గాంచుచుండును ॥ జయ ॥

3. కన్నబిడ్డలట్లు మనల - గౌరవించును
చిన్నపుత్రులార యంచుఁ - జేరదీయును ॥ జయ ॥

4. తల్లి శ్రీ బ్రిటానియాకు - నెల్లజనులు మెచ్చఁగా
నుల్లమెల్లరంజిల - నునుజయంబొసంగుమా ॥ జయ ॥

5. వెలఁదులెల్లఁబాడఁగాను - వేంకటాంబవేఁడగాను
సలలితముగ జనులు నిన్ను - సన్నుతించుచుండగా ॥జయ॥

## పాతివ్రత్యము.

సోదరీమణులారా !

భూలోకంబున భామలకు శిరోభూషణము పతిభక్తి యని మీకెల్లరకుఁ దెలిసినసంగతియే. విస్తారము వ్రాయ ననవసరము. పతివ్రతాతిలకంబులై విశ్వంభరామండలంబునఁ బ్రాణేశులఁగూడి మహాటవీప్రదేశంబులను సంచరించుచు, నుడువరానియిడుములనుబడి యెట్టకేలకు నధికైశ్వర్యంబు లనుభవించిన జనకాత్మజయగు జానకియు, పంచపాండవులకనుంగు సతీమణియగు బాంచాలియు, సలలితగుణ ప్రభావుండగు నల ధరణీశునకుఁ బేర్మిభార్యయగు దమయంతియు, యశశ్చంద్రికల నలుదిశలవ్యాపింపఁజేసిన సత్యకీర్తియగు హరిశ్చంద్ర చక్రవర్తికిఁ బ్రియకాంతాలలామయగు చంద్రమతియు, తనముద్దుగులుకు జిలిబిలిపలుకులచే శమనుని మెప్పించి భర్తను సజీవునిగానొనర్చిన సుగుణాలవాలయగు సావిత్రియు నాదిగాఁగల మహావీరపతివ్రతాశిరోరత్నంబుల చారిత్రంబుల మీరు వినియే యుందురు. అట్టి మానవతీలలామలొనర్చు మహాశ్చర్యకార్యంబులకు నెంతటి యచ్చెరువందవలసియుండును. పూర్వకాలమందు వనితలలో మగఁడు బాధలనుభవించుచుండినఁ దాముఁ గూడ ననుభవించుచు మగనికి దేహమనారోగ్యంబుగానున్న, చేయఁగలచికిత్సలఁజేయుచు, నహోరాత్రింబులు నిద్దురలేక కండ్లుగాయలుగాచునట్లు వివిధశ్రమలొందుచు, మగఁడానంద

వార్ధిలో మునుఁగఁ దాను నశ్లే యొనర్చుచుఁ, బ్రియుండా మహాదుఃఖసాగరంబున మునిఁగియున్న దాను శోకపారాబ్ధి లోమునుఁగుచు, నాథుండు విపదాంబుధియందున్న నాతని రక్షించుటకు ననేక సత్ప్రయత్నంబులొనర్చుచు, మగఁడలసి గృహమున జేరినతోడ హస్తంబున వీవనఁబట్టి విసరుచుఁ జల్లని వాయువుచే నాతనియుల్లంబునకు నెంతేయు నానందంబుఁ గొల్పుచు, సఖుఁడు పరగామ్రమార్గమెచనుతరి నాభరణంబులను దాల్చుటనుమాని, పరపురుషసందర్శనం బేదోషంబుగానెంచి పరపురుషసంభాషణంబులు నిలిపి, యన్నివిధములఁ బతులకు సాహాయ్యకారులుగా మెలంగుచు, "మగువ మగనికి నర్థాంగలక్ష్మి" యను పెద్దలవాక్యము సార్థకముగాఁజేయుచుండిరి.

కాంతామణులారా! పాతివ్రత్యమహాత్యంబులనుగూర్చి యనుదినంబును మనగృహంబులందు ముదుసలులు చెప్పుచుండ ననేకసారు లనేకగాథల మనము వినుచుండలేదా? అందువలన నేరికి నెట్టిసౌఖ్యానందంబులుకలిగెనో మీకుఁ దేటతెల్లమగును. పతివ్రతాశిరోరత్నంబుల దూషించు దుర్మార్గులుకూడఁ దామెట్టి నరకబాధ లనుభవించిరో యీక్రిందిగాథలవలన విపులమగును. వానిని గొంతవర కిట వివరించుదానను.

లంకాధిపతియగు దుర్మార్గుండగు రావణాసురుఁడు జానకీదేవిని బల్మిఁగొంపోయి, యాడరాని దుర్భాషలనాడి భూసుతకు నెన్నియో బాధలఁ గలుగఁజేసి, తుదకు రామబాణంబులకుఁ

జిక్కి నరకబాధ లనుభవింపలేదా? ద్రుపదనందనయగు ద్రౌప
దిని గీచకుండు బల్మిని మోహించినందులకు భీముని చేఁ జావ
లేదా? అదియునుంగాక, వీరసేనసుతుని సతీమణియగు దమ
యంతి యటవీప్రదేశంబున నేకాకియై సంచరించుసమయంబునఁ
గిరాతుండగు వీరనాయకుండు మోహించినందున, నామె పాతి
వ్రత్యమహాత్మ్యముంబట్టి యగ్నిజ్వాలలు ప్రజ్వరిల్ల భస్మీభూతుఁ
డగుట వినలేదా? ఇట్లిందఱందఱు పతివ్రతాతిలకంబుల పొం
దఁగోరినందులకు నచిరకాలంబులోనే తగిన ప్రాయశ్చిత్తము
నొందిరి. కానఁ బ్రియసోదరీమణులారా! నేనిప్పుడు చెప్పఁ
బోవున దేదియన మీరెల్లరు సద్గుణాతిశయంబునుబొంది, సత
తము పతినే దైవంబుగానెంచి, యాతనినే బ్రార్థించుచు,
నాతనికే సేవలొనర్చుచు, సర్వవిధముల నాతనిక్షేమమే యార
యుచుఁ బైని వివరించినరీతిఁ బ్రవర్తించుచు నఖిలమునకు నాతనినే
నమ్మియుండి, భూలోకంబున యశస్సునొంది, సకలజనపూజితు
రాండ్రయి, చిరకాలము మీమీచారిత్రంబులు, ద్రౌపది,
దమయంతి, సావిత్రి మొదలగువారి చారిత్రంబులనుబోలెఁ
బ్రతికాంతకుఁ, బ్రతిబాలికకు మిక్కిలి నీతిదాయకములై,
ప్రసిద్ధివహించునట్లుఁ బ్రవర్తింపుఁడు. మానవతియను పతివ్రతా
శిరోరత్నంబునుగూర్చి యొకకథ నిట నుదహరించినదానను.
శ్రద్ధవహించి చదువుఁడు.

## క థ.

---

శ్రీరమ్యంబగు నుజ్జయినీనగరంబున నిరువురు కిరాతదంపతులు నివసించుచుండిరి. వారెన్నియో గొప్పవ్రతములను, క్రతుచయంబులు నొనర్చిరి కాని సంతానహీనులైనందులకు నహోరాత్రింబులు మిగుల దుఃఖవారాశిలో మునింగియున్నవారై, తమమనోరథం బీడేఱనందువలన మానసములుచలించి విరాగులై తత్సమీపమునందున్న ఘోరకాంతారసీమకుబోయి గిరిజాంబను దప్పక ప్రార్థించుచుండిరి. భామామణులారా! సకలైశ్వర్యామోదంబులిచ్చి వంశవృక్షంబునంగల శాఖోపశాఖలు లోకంబున వెల్లడించు నొక్కకుమారుండైనను, కుమారితయైనను లేనివారిజన్మమేల? రాజ్యమేల? బంధు గురుమిత్రాదులేల? మహాభోగంబులేల? అష్టైశ్వర్యంబులేల? సజ్జనసాంగత్యమేల? పరోపకారపరాయణంబేల? ధరణీతలంబున మనము జన్మించినది మొదలు మనలంగూర్చి పడరానిశ్రమలంబడుచుఁ బాలువుగ్గులుబోసి, పెంచి పెద్దఁగాఁజేసి, సర్వకలాపూర్ణులుగానొనర్చి, మనము కీర్తిమంతులమై శోభిల్లుచుండ, నిరతంబును మనమేలుఁగోరు మాతాపితాదులకుంగల్గు నానందంబునకు మేరయే? కాని, కిరాతదంపతులపై గిరిజాంబ తనకరుణాకటాక్షవీక్షణములింకను బ్రసరింపజేయలేదు. పతి యనుదినంబును ప్రాంతంబునంగల కందమూలాది దివ్యఫలంబులనుదెచ్చి యీ

యుమానవతి మగనింగూడి భుజించుచుండెను. పాపము! దం
పతులు దప్పిఁగొనునప్పుడెల్ల సమీపమున హోరుమని ధ్వని
నొసంగుచుఁ బ్రవహించుచున్న వాహినికడకుంజని పుష్కర
మును గొనుచుండిరి. మానవతి భర్తయగు సుధర్ముండు,
పరోపకారపరాయణుఁడు, సద్గుణోత్తముఁడు, శాంతుండు, యేక
పత్నీవ్రతుండు, దైవభక్తాగ్రేసరుండు, భూజనసన్నుతుండు,
యశశ్శాలి, సకలకలాపరిపూర్ణుండై యలరారుచుండెను ఇంక
మానవతి సద్గుణపుంజంబనుటకు నొక్కింత సందియంబుకలదా?
పతియే తనకు దైవంబనితలంచి నిరతంబాతండే దిక్కంచు నెం
చి, సకలోపచారంబు లాతనికింబొనర్చుచు, పరపురుషసందర్శ
నాలాపంబులను మాని, మగఁడింటలేని యొక్కక్షణమైన
యుగంబుగాఁదలపోయుచు, నిత్యము నాధునే మనంబున ప్రా
ర్థించుచుఁ, ప్రాతఃకాలంబుననే శయ్యనుబాసి గృహకృత్యం
బులఁ జక్కఁగ నిర్వర్తించుచు, భర్తృచిత్తానువర్తినియై, సుశీలై
కనిరతయై, ప్రాణేశుని హితాచరణంబునం దాసక్తురాలయి,
బంధుగురుమిత్రాదులయందు యథోచితగౌరవంబునుజూపుచు
దుష్టవర్తనులగు తోయజాక్షులతోడ నాలాపంబులఁగట్టిపెట్టి,
ధర్మమార్గానువర్తినియై, మగనితోడిదే తనకు లోకంబనిభావిం
చుచుండెను. ఇట్లుండ నొక్కనాఁడు సుధర్ముండు కందమూ
లాదిఫలంబులను దేరఁ గాంతారసీమాంతరమునకుఁ బోయెను.
అధికభోగంబులనుభవించిన సుధర్ముండు కాననంబులలో సంచ

రించుచుఁ గందమూలాదిఫలంబులను దిని జీవించుటచే శరీరము
కృశించి, యనారోగ్యంబగుటవల్లఁ దాను తిరిగి నిలయమునకు
నేతెంచుచుండ మధ్యేమార్గంబున మూర్ఛిల్లినవాఁడై యొక
భూజముక్రిందఁ బడియెను. కలకలారావంబులతో నిండియుం
డు నుద్యానవనముంబోలు నిలయంబు తనపతిలేమి శారికా
రాజులేని పంజరముభాతి చిన్నవోవ మానవతి నాథునిరాక
కెదురుచూచు చుండెను. పాపము! ప్రియుండు నిలయంబున
కరుదెంచు వేళ మీఱినది. మానవతి కడుఁగడుదుఃఖించుచుం
డెను. శ్రీమతి పార్వతీదేవి ప్రత్యక్షమై మానవతితో నీరీతిగాఁ
బలికెను. ‘‘నీనాథుండగు సుధర్ముండు చిదానందమూర్తియై
నిలయంబున జేరును. ఆతండు కొన్నికొన్ని కారణంబులఁబట్టి
వనంబున మూర్ఛిల్లియున్నవాఁడు. కనుక, నీవొక్కింతయు
భీతిఁజెంది విచారింపకుము. మీయిరువురియొక్క మనోభీష్టముఁ
దీరునట్లు వరంబొసంగితి. సకలైశ్వర్యంబు లనుభవించుచుండుఁ
డు. నీనాథుండు వచ్చినతోడనే మరల నుజ్జయినీనగరంబునకుఁ
బొందు. నీకు నీపతియందుఁగల భక్తికి ననురాగమునకు నెం
తయు సంతసించి కొనియాడితిని. ఇంక నేఁబోయెద.’’ ఇట్లు
పలికి దుర్గప్రత్యక్షమార్గంబుఁబాసి యెప్పటియట్లు నిరాకార
యయ్యెను. గిరిజాంబవచనంబులనమ్మి మానవతి పతిరాక
కెదురుచూచుచుండెను. అంత సుధర్ముండు ఫలంబులనుగొని
మందిరముఁజేరెను. మానవతి గిరిజాంబాప్రత్యక్షముంగూర్చి

యు, మనోభీష్టసిద్ధింగూర్చియు విన్నవించెను. సుధర్మురి జెంతయు నానందభరితుండాయెను. దంపతులు కాంతారమున వసించియున్న సమయంబుననే కొలఁది దివసంబులు గడచిన వెనుక నొకనాఁడు మానవతికి నవమోహనాంగుఁడను బాలకుండు జన్మించెను. సుధర్ముండు పుత్రరత్నంబు జన్మించిన కతమున మహోత్సవంబులెన్నియో చేయించెను. వారు గిరిజాంబయొసంగిన వరప్రసాదంబున జేసి, చిరకాలమష్టైశ్వర్యానుభూతులై, జీవించిరి. భామామణులారా! పాతివ్రత్యమహాత్యంబన్ననెద్దియో యెరింగితిరా? మీరును చిరకాలము కిరాతసరోజాననయగు మానవతినిబోలె పతిభక్తిఁగలిగి మెలఁగుచు నధికైశ్వర్యంబు లనుభవించుఁడు.

సోదరీమణులారా! మరియు, మనమెల్లప్పుడుత్తమ గుణంబులనే మానసంబునగల్గి, యుత్తమకార్యంబులనే నెరవేర్చుకోఁగలవారమై యుండవలయును. ఇట్లుండఁ గర్మవశంబున నిడుములుసంభవించినపుడు వానిని బాటింపక మనంబు చలింపనీక ధైర్యలక్ష్మి నూఁతగొనవలయును.

సీ॥ రావణాసురుచేత ♦ రామచంద్రునిభార్య
సీతబాధలఁజెక్కు ♦ చెందలేదె?
కాలకౌశికునింట ♦ కామినీమణి చంద్ర
మతిపాటులఁ జెంది ♦ మనఁగలేదె?

పాంచాలిసభ మాన ♦ భంగంబునందియు
పడరానియిడుమలఁ ♦ బడఁగ లేదె ?
నలసార్వభౌముని ♦ నాతియద్దమయంతి
అడవులంబడి బాము ♦ లందలేదె ?

గీ॥ అకట ! యిన్ని బాధలఁ జెంది ♦ నప్పటికిని
వారు సద్యత్నములఁ బూన ♦ మానినారె ?
కావుననె లోకసంభావ్య ♦ కలితలగుచు
వార లిహపరసుఖములఁ ♦ జూరగొనిరి ॥

అదియునుగాక,

మన మొనర్చు సత్ప్రయత్నంబులుగాని, సత్కార్యములుగాని, కుటిలమానసులు గొందఱు చూచి, యోర్వలేమిచేఁ దృణీకరించి నిందించుట కలియుగాచారమై పరఁగుచున్నది. కాన విశ్వంభరామండలంబున మానవజన్మంబున రూపభేదంబులు వేరువేరుగానున్న చందంబున గుణస్వభావోక్తులుగూడ సదా మారుచుండును.

ద్విపద. ఎల్లరిఁ మెప్పింప ♦ నేరికివశము ?
కల్లగాదెంతయుఁ ♦ గామినులార !
ప్రబలమూర్ఖులయెదఁ ♦ రంజిల్లఁజేయు
నబలలకేగాక ♦ యజునిదరంబె ? ॥

మనము సర్వదా సత్ప్రయత్నంబులనే చేయుచు, సత్కార్యంబులనే నెరవేర్చుచు సద్గుణురాండ్రమై యుండవలయును.

## పాట—తోహారవరుస.

1. నాదుకోరిక సఫలముచేయవె? నగపతిప్రియపుత్రి!
నాదుభర్తకు శుభములొసఁగవె? నారీరత్నమ నేఁడు॥ నా॥
2. తప్పులెంచక తామసించక, తల్లిపార్వతినీవు
ఒప్పిదంబుగనన్నుఁబ్రోచి నా, తప్పులన్నిగావు ॥ నా ॥
3. పసపుకుంకుమ పరిమెళగంధము, మంచిపువ్వములును
వాలాయంబుగనీకు నొసఁగెద, వారిజాక్షినేడు ॥ నా ॥
4. హరునిసతీమణి మరిమరి వేఁడెద, నాపదనెడఁబాపు
దాపునీవని ధరణిలోపలఁ, దలఁచితి నామదినేడు ॥ నా ॥
5. పరిపరివిధముల వేఁడితినేఁడు, పంకజాక్షిగౌరీ!
దండముదండము దండమునీకిదే, గట్టురాయపట్టీ! ॥ నా ॥
6. ఇట్లు వేఁడెడు వేంకటాంబను, నెల్లపుడున్ భువిలో
పూర్ణకటాక్షేక్షణముల నొసఁగి, బ్రోవుము శ్రీగిరిజా ॥నా॥



## గిరిజాంబను వేఁడుట.

సీ॥ వేఁడితినమ్మ! గౌరి! మన ♦ వింక వినవే? యిటువేంకటాంబికన్
జూడవె? ప్రేమతోడఁగడు ♦ సొక్కుచు సోలుచునున్న దాన, నేఁ
బ్పాడినపాట నిష్ఫలమె? ♦ భక్తపరాయణి! మోక్షదాయనీ!
పాడెద నీదుకీర్తనలు ♦ భవ్యముదంబున సంతతంబిలన్ ॥

ఉ॥ తప్పులఁ గావుమమ్మ ! నను ♦ దగ్గరఁజేరిచి ప్రోవుమమ్మ ! ని
న్నెప్పుడు వేఁడుదాన నిల ♦ నిండుముదంబున లోకపావనీ !
గొప్పగఁజేయుమమ్మ! ననుఁ ♦ గూర్మినిజూడగదమ్మ! పార్వతీ !
మెప్పునుగాంచవమ్మ! కడు ♦ మేలునొనర్చుము వేంకటాంబకున్ ॥



## భ_క్తి కీ_ర్త న లు.

పాట—రూపక తాళము.

1. జయజయశివశంకరీ ! వరకృపగౌరీ ! జయజయశివశంకరీ !
సర్వమంగళదాయినివనుచు, సన్నుతించితినిన్ను నామది
నిత్యము నీసేవఁజేయుచు, నిరీక్షించితిఁదల్లి గిరిజా ! ॥జయ॥

2. అఖిలమోదంబుతోడన్ అంబా జననీ ! ఆత్మలోఁగడుఁబూజ
సేతును
శాశ్వతంబుగ నిన్ను వేఁడితిఁ, బట్టుదలగానిన్నుఁ బాడితి
నిండుభ_క్తిని బిక్షమొసఁగవె ?, పతికిక్షేమము నిరత మొసఁ
గవె ? ॥ జయ ॥

3. ఓంకారస్వరూపిణీ! పతితపావనీ!, స్మరించెద నీపదాబ్జంబులు
దీనులనురక్షించునట్టి, దివ్యబిరుదము నీకుఁగలదు
నిరతము నీదివ్య తేజముఁ, జూపి మోక్షము నాకొసంగవె?॥జ॥

4. నిత్యనిరాకారిణీ ! నిర్దోషిణీ ! నిరుపద్రవదాయినీ !
ఎన్ని విధములచేతనైనను, కన్నతల్లిరో ! నీపెదిక్కు
స్మరించెద నీపదాబ్జంబులు, బిరాన నన్నుఁబ్రోచిగావుము॥జ॥

5. నిఖిలజననీ ! పావన ! హృదయకమలవాసినీ !
ధరను మానం వేంకటాంబను, సిరులొసంగుచుఁ బ్రోతువని
స్థిరముగామదినమ్మియుంటిని, శీఘ్రమే ననుఁ బ్రోవుమా ॥ జ॥

పాట.

( శ్రీశైలా ! శ్రీశారదామనోవినోదినీ — అనువరుస. )

1. శ్రీభామా ! శ్రీభోగిభూషణమనోప్రియా !
శ్రీ యీశ్వరసతీ ! శ్రీశుభాంగి ! యో ! ॥ శ్రీభామా ! ॥
2. నన్ బ్రోవన్, నీకుభారమేమె ? దెల్పుమా ?
సురసన్నుతా ! సతీ ! వేంకటాంబఁ బ్రోవుమా ॥ శ్రీభామా ॥

పాట — బ్యాండుస్వరము — ఏకతాళము.

1. నీరజాక్షి ! పార్వతీ ! నిన్నెనతము వేఁడెదన్
గౌరి ! నన్నుఁ బ్రోవరాదె ? కాపాడమంటినీ ॥ నీర ॥
2. దీనురాలనై తినమ్మో ! దీనపోషణీ !
పూనివేగఁ బ్రోవరాదె ? పూజలెన్నొ చేసెదన్ ॥ నీర ॥
3. శరణుశరణుశరణిదే, కరుణతోడఁ జూడవే ?
హరునిరాణివేఁడెదన్, తరుణినన్నుఁ బ్రోవవే ? ॥ నీర ॥
4. పిన్ననాఁటినుండినేను, నిన్ను వేఁడుచుంటిని
కన్నతల్లిప్రోవరాదె ? నన్ను వేంకటాంబను ॥ నీర ॥

## పాట.

( గున్నయ్యగారి చిన్నసూరిమగఁడు—అనువరుస. )

1. శివునిరాణీ! నిన్నె పాడెదర్
భువనమందు నిన్నె వేఁడెదర్
నిన్నుఁగూర్చి నేమాటాడెదర్
కన్నతల్లిరో! నీకేంఁగోపము ॥ శివుని ॥

2. తరుణినైన ననుఁబ్రోవవే?
కరుణతోడ వేగఁగావవే?
తనయగాను నన్నుఁజూడవే?
జననినన్ బ్రోవ నీకొక్క భారమే? ॥ శివుని ॥

3. వరములెన్నెన్నో నీవిచ్చినావు
గిరిజా! యెందరినో, రక్షించినావు
కరుణ బెంపొందఁగఁ, జూచినావు
మానం వేంకటాంబను, బ్రోవుమా ॥ శివుని ॥

## పాట.

( మంజరి చదువునట్లుగాఁ జదువవలయును. )

1. నారాయణి! యీలోకమునందున, నారీమణులెవరమ్మా!
ప్రేమతోడను బతులఁజూచుచు, సేవఁజేయరమ్మా! ॥నా॥

2. జన్మపావనము చేయుటకొరకై, జ్ఞానమందరమ్మా!
అన్నిటికిది కడసారివాక్యమని, యాత్మఁదలఁచరమ్మా!॥నా॥

3. సకలజీవులను తమవలె మనమున, సమముగనెంచరమ్మా !
అత్తమామలఁబూజఁజేసి వారి, యాజ్ఞఁబొందరమ్మా !॥నా॥
4. పరపురుషులఁ దమసహోదరులుగాఁ, బాటించరమ్మా !
అర్ధశరీరంబైన నాథుని, నాత్మనెంచరమ్మా ! ॥ నా ॥
5. ఇలలోఁ బతివ్రతధర్మము ముఖ్యము, వివరముమదినెంచఁ
బతికన్న ను దైవంబిలలోఁ, బడఁతుల కింకెవరమ్మా !॥నా॥
6. కామక్రోధలోభమోహములు, కడకుఁజిమ్మి వేసి
ధనధాన్యంబులుకలిగిన తనమది, గౌరికరుణనుంచి ॥ నా ॥
7. నిండుగనల గిరిజాంబనుమీరలు, నిరతముభక్తినిగొల్చి
దండిగ నైశ్వర్యంబులుకల్గియు, ధవులభక్తిని గనరమ్మా!॥
8. బీదసాదుల నాదరించిన, ధర్మముమదినుంచి
శాంతచిత్తముఁదాల్చియెల్లరి, శ్రీమలనుబోఁగొట్టి ॥ నా ॥
9. నిత్యము తనపతిదైవంబనుచును, నిజముగ మదినెంచి
నిండుగ శైలతనూజను నెన్నఁడు, విడువక మదిఁదలఁచి॥నా॥
10. పతివ్రతభూషణియైనటువంటి, పదవిచేతఁబట్టి
ఇలలో మానం వేంకటరత్నము, నేలుముదయతోగౌరీ ! ॥

పాట—బ్యాండుస్వరము—ఏకతాళము.

( శయనించుతరి పాడవలయును. )

1. నిరతంబును, గిరిజాంబరో, కరుణారసంబునన్
నీసేవన్ జేతు, నిండుభక్తిని ॥ నిరత ॥

2. దయఁగావుము, జయపార్వతి, శయనింపఁబోయెదన్
నిన్నే వేఁడెదన్, నిత్యకల్యాణీ! ॥ నిరత -
3. అనయంబును, ననుఁబ్రేమను, గనుచుండుమీశ్వరీ!
శ్రీశైలపుత్రీ! శ్రీశుభాంగీ! ॥ నిరత ॥
4. ననుఁబ్రోవఁగ, జననీమణి! మనమందునెంచెదో?
కోపంబందెదో? వేంకటాంబపై ॥ నిరత ॥

## పాట.

( మంజరి చదువునట్లుగాఁ జదువవలయును. )

1. అమ్మా! పార్వతి వేఁడితినమ్మా! పరాకేలనోకొమ్మా!
నిరాకారి నీదివ్యరూపము, నిత్యమొసఁగవమ్మా! ॥ అ ॥
2. శాశ్వతాగమమాతవనుచునే, శరణుఁజొచ్చితినికొమ్మా!
శరణుఁజొచ్చిన నరమరఁజేయుట, తగునా నీకోకొమ్మా!॥అ॥
3. పాపిమారునివైరి భామినీ! పంతమేలనమ్మా!
పంతమూన నేనెంతదాననే? యింతి యీశ్వరమ్మా! ॥అ॥
4. దీనురాలనై వేఁడితినమ్మా! దిక్కుగునీవేనుమ్మా!
కరుణతోడనువేగఁబ్రోచి నీ, దరికిఁజేర్చవమ్మా! ॥ అ ॥
5. ధారుణిలోనీవు తల్లివినాకని, దలఁచియుంటినమ్మా!
మానం వేంకటరత్నాంబను నీ, మక్కువతోడను గనుమా॥

## పాట.

( ఈశ్వరా! పరమేశ్వరా! జగదీశ్వరా! కరుణించరా — అనువరుసు. )

1. ఈశ్వరీ! ననుఁగావవే? పరమేశ్వరీ! ననుఁబ్రోవవే?
కడుముదంబున వేఁడుచుంటిని! గానసుందరి పావనీ!
గానసుందరి లోకపావని, గాననైతిని నామదిన్ ॥ ఈశ్వ ॥
2. ఘనతసేవితగుణకరీ! వర, ధర్మకరుణాధారిణీ!
అల్లశివపురి వల్లభునకును, నుల్లమంతయు రంజిలన్
నీదుచల్లని హృదయమందున, నాదరించవె భామినీ! ॥ ఈ ॥
3. నీదుమహిమలు గాననైతిని, నీచురాలిని బ్రోచియున్
కరుణతోడను వరములొసఁగియుఁ, గావవే? గిరిజాంబరో?
కోపమా? యికఁదాపమా? నా, పాపమా? నన్ బ్రోవుమా ॥
4. లోకమాతవు నీవెయంచును, బ్రాకటంబుగ నమ్మితిన్
దీనురాలినిబ్రోవవే? యిఁక, దిక్కులేరిలఁ గావవే?
వేంకటాంబను వేరుచేయక, వేగఁబ్రోవవె? యీశ్వరీ! ॥ ఈ ॥

---

## పాట.

( కుందరదన నీయందముఁ జూచిన డెందమోమవశమే — అనువరుస. )

1. శైలతనయా! నీమేలుమరవను, బాలపేర్మినుగనుమా
సంతతంబుఁ బంతమూని, యింతినిన్ను వేఁడెదన్
వినుమింతి! నిన్ను వేఁడెదన్ ॥ శైల ॥

2. నన్నుఁ బ్రోవఁగ నున్న దానవు, కన్నతల్లిరో ? నీవే
( బ్రోవరాదె ? సేవఁ జేతు, భావమందు వేఁడెదన్
నిను భావమందు వేఁడెదన్ ॥ శైల ॥

3. దిక్కు నీవని నిక్కువంబుగఁ, జక్కఁగ మదినెంచి
భక్తితోడ ముక్తికై యా, సక్తితోడ వేఁడెదన్
నను వేంకటాంబను బ్రోవుమా ॥ శైల ॥

---

పాట.

( బాలరావె పోలనీభూపాలమౌళి నిఁజూడుమా—అనువరుస. )

1. జాలమేల ? లోకమాత ! జాలియింకనుగల్గదా ?
చాలకాలమునుండి మిక్కిలి, సంతసించుచునుంటిని ॥ జాల॥

2. నన్నుఁ బ్రోవకుండుటయ్యయొ ! కన్నతల్లిరో ! న్యాయమా?
నిన్ను నెమ్మదినమ్మియుంటిని, నన్ను పీడుటపాడియా ?॥ జాల॥

3. పంతమేల ? నీకునాపై, భక్తిపోషిణి ! బ్రోవుమా
పంతమూనఁగ నెంతదానను, ఇంతి యీశ్వరి బ్రోవుమా॥

4. దిక్కు నీవని నమ్మియుంటిని, దీనపోషణి గావుమా
మ్రొక్కులిడెద వేంకటాంబను, మోక్షదాయిని జూడుమా॥

## పాట—బాలికాబోధన—ఏకతాళము.

( విలసిల్లు నీశరదాగమంబు వేడ్క—మీరఁగా—అనువరుస. )

1. వినుఁడింతులార! మీకు నొక్క, వింతఁ జెప్పెదన్
గనుషల్ల దక్షిణమునఁ బెద్ద, కాలయమపురిన్ ‖ విను ‖

౨. గనుచుండు యముఁడు శిష్టదుష్ట, జనసమూహముల్
జనబృందమందునున్న దుష్ట, జనులకెప్పుడున్ ‖ విను ‖

౩. ఘనబాధలనుభవింపఁజేయుఁ, గాదె? నమ్ముఁడీ!
మనమందు చింతలేక కఠిన, మానసుండయ్యున్ ‖ విను ‖

౪. అనయంబు మంచిపనుల నాచ, రించుశిష్టులన్
తనకన్నబిడ్డలట్లు మిగుల, దయనుజూచుచున్ ‖ విను ‖

౫. క్షణకాలమందునంపువారి, స్వర్గపురికిని
గనుచుండి గౌరవించు నెప్పుడుఁ, గడుముదంబునన్ ‖ విను ‖

౬. వనజాక్షులార! మీకు నరక, బాధలేటికిన్
ఒనరించుచుండుఁడెపుడుచూడ, నుత్తమకార్యముల్ ‖ విను ‖

7. వినవేఁడుచున్నదాన నాదు, విన్నపంబునున్
వినకున్నఁ గోపమేలని మీకు, వేంకటాంబపై ‖ విను ‖

## ద్విపద.

( పాటగాఁగూడ నుపయోగించవచ్చును. )

బాలికామణులార ! - బాగుగావినుఁడు
వేలలయ్యనుమీరు - విద్యనేర్చుటను
మానక కడువిద్య - మహిలోననేర్చి
పూని దేశంబునఁ - బూజ్యరాండ్రగుచుఁ
బతిని దైవంబుగా - మతినెంచుచుండి
సతతంబు నాతఁడే - గతియంచు నెంచి
సేవ లెన్నెన్నియో - చేయుచుండియును
భావమందాతని - భక్తివేఁడుచును
గర్వాతిశయములన్ - గాంతనువీడి
శర్వాణిదేవినే - సతముభజించి
కుగుణంబులను మదిఁ - గొనకుండ నెపుడు
సుగుణత్వగరిమచే - శోభిల్లుచుండి
ఘనయశస్సునుబొందఁ - గా యత్నములను
వనితలౌ దమయంతి, - పాంచాలులటులు
సలిపి సద్యశమొందఁ - జాలుఁడు చాలు ;
విలసిల్లుచుందురు - విశ్వంబునందు
ఇహపరంబులమీకు - నెక్కుడుసుఖము
లహహా ! మీయానంద - మలవియె చెప్ప ॥

## పాట — రూపకతాళము.

1. వినవే? గుణభూషణీ! బాలస్త్రీకుజాలమేటికిఁ ॥ వినవే ॥
కల్లలాడక నీదు నుల్లంబురంజిల్లఁ, బల్లవపాణిరో! వినుమా,
మంచిమార్గంబులెన్నైనఁజనుమా, నాదు నీతులు నీయా
త్మఁగొనుమా, సతము నీభర్తప్రేమనుగనుమా, దుష్టమా
ర్గంబులఁ ద్రొక్కమానుమా, మగఁడె దేవుండు నీకంచు
ననుమా ॥ వినవే ॥

2. గృహకృత్యములఁ జేసి, పొరుగిండ్లనుఁ బాసి, పతిరాక
వీక్షింపుమా, దీనజనులను రక్షింపుమా, దిక్కుపతియంచు
నెదనమ్ముమా, అన్నఁదమ్ములదయఁజూడుమా, అక్క
సెల్లెండ్రపైఁ బ్రేమనిడుమా ॥ వినవే ॥

3. కోపంబునెడబాపి పాపంబువిడనాడి, తాపంబునొకమూల
నుంచి, పతిని దైవంబుగామదినెంచి, సతమునాతనిక్షేమం
బుఁగాంచి, కన్నబిడ్డలను దయతోడఁ బెంచి, ధర్మమార్గంబు
నెప్పుడెంచుచుండుమా ॥ వినవే ॥

4. జారుండు, చోరుండు, భీరుండు, క్రూరుండు, నేరస్థుఁడే
యైనను, దారదుఃఖించువాఁడైనను, ఘోరపాపాత్ముఁడే
యైనను, చారురూపుండు కాకున్నను, వారకాంతలతో
నున్నను, నారీ! నాథుండెగతియంచు నెంచుమా ॥ వినవే ॥

5. శాంతస్వభావంబు సంతతంబునుగలిగి, పంతంబులనుమాని
చెలఁగి, గర్వంబులేకుండ మెలఁగి, ప్రాణనాథునిపై భక్తిఁ
గలిగి, మాయపోలతులకడనుండితొలఁగి, భక్తికీర్తనలెప్డు
దుఁబలికి, వేంకటాంబబోధ నాలకింపుమా ॥ వినవే ॥



పాట—స్వదేశాభిమానము.

(ఇండియా యాత్రీలచరితము నింపుగా నాలింపుఁడీ—అనువరుస.)

1. పరమసద్గుణమాత భరత, మాత కెన్నియొ సౌఖ్యముల్
తరుణులారా! గూర్పవలయుఁ, దగఁబ్రయత్నమునల్పుఁడీ ॥

2. భరతదేశమునందుఁబుట్టియు, భారతీయులమయ్యు నీ
భరతమాతకుశ్రీమలనిచ్చుట, బాడియామన కెన్నఁడు ॥పర॥

3. తల్లికెప్పుడుఁ గన్నపుత్రిక, లుల్లమునకానందముల్
సల్లలితముగఁగూర్పవలయు, సద్యశంబునుబొందఁగాఁ ॥పర॥

4. అల్ల గిరిజాదేవిఁగొల్చిన, నన్నికోర్కెలుదీర్చును
కల్లవేషములెల్లమానియుఁ, గాంతలారా! వేఁడుఁడీ !॥పర॥

5. ధరణియందున వేంకటాంబను, దయనుజూచుచునుండుఁడీ ॥
నిరతముల్ మిముఁదరుణులారా! నిండుప్రేమనుజూచుచు॥



## హూణవిజయప్రార్థనము.

సీ॥ చిరకాలముననుండి ♦ భరతభూమికి నెట్టి
బాధలు లేక గా ♦ పాడుచున్న
నవమానసములు మోసి ♦ యవనిలోఁగన్నట్టి
బిడ్డలట్టులమమ్ముఁ ♦ బెంచుచున్న
తమరాష్ట్రమునఁగల ♦ ధాత్రీశ్వరుల నెల్ల
సోదరులనుమాడ్కిఁ ♦ జూచుచున్న
ఆంగ్లేయవిద్యమా ♦ కవలీలనేర్పించి
మంచిపఖ్యాతి వ ♦ హించుచున్న
గీ॥ సమరవీరులు ధీరులు ♦ చతురమతులు
సుగుణసంపన్నులున్ గీర్తి ♦ శోభితులును
చారురూపులు గారుణ్య ♦ సాగరులును
నైన హూణులు విజయులై ♦ యలరునటులు
వరములొసఁగునుగాక ! శ్రీ ♦ వరుఁడుకృపను ॥

## పాట—మంగళము.

1. నిత్యము నిన్నుఁ, నిండగుభక్తిఁ, నెమ్మదిఁగొల్తుఁ,
మంగళం, జయపార్వతీసతీ !
లోకపావనీ ! భువనైకరక్షణీ ! ॥ నిత్యము ॥

2. ప్రేవుముఱన్నన్, మోదముతోడన్, శైలేశపుత్రి !
మంగళం, శ్రీపార్వతీసతీ !
దీనరక్షణీ ! వేంకటాంబపోషణీ ! ॥ నిత్యము ॥



౪॥ మంగళము లోకమాతా !
మంగళము దయాబ్ధి ! సర్వ ♦ మంగళ ! దేవీ !
మంగళము శైలతనయా !
మంగళమో దుర్గ ! నీకు ♦ మంగళమిదిగో ! ॥



అబలాసన్మార్గబోధిని.

సంపూర్ణము.



Sree Savitri Press, Jagannaickpur, Cocanada.

